వనలతాదేవి తనభర్తను గేవలము దైవతుల్యునిగా భావించి యతని పనిని నౌకరులచేఁ జేయింపక తానే చేయుచుండెను. ఆమె పతిభక్తిని గాంచినవా రందఱు నిజమయిన పతిభక్తియనిన నిదియేగదాయని మెచ్చుచుండిరి. వ్యాధిలోనుండి భర్తకుఁ దాను భోజన మిడలేని సమయమునందు సహితమామె భర్తకును, గుమారునకును దనయెదుట భోజనము పెట్టింపుచుండెను. ఈమె మరణదినమునం దీమె భర్తకుఁ గొంచెము దేహమస్వస్థముగా నుండెను. ఈమె మరణమున కరగంటకు ముందు భర్త వెచ్చని చొక్కా దొడిగికొనకుండుటను జూచి "మీశరీర మస్వస్థముగానుండినను మీరు వెచ్చనిబట్టలు తొడిగికొనక యేలయుంటిరి"ని యాయంగీని తెప్పించి యాతని కిప్పించి తొడిగికొనునట్లు చేసెను. తనమరణవేదన నొకమూల నుంచి పతికళ్యాణమునే గోరునీకాంతయొక్క పతిభక్తి నెంతఁ గొనియాడినను దీఱదు. అనేకులను కొమరులకును, గూఁతులనుగని వారినిఁ దననేర్పుచేఁ బెంచి పెద్దవారినిఁజేసి తనకుఁగల శిశుపాలనము నందలి నిపుణతను వెల్లడింపఁ దనకు సమయము చాలకున్నను నీమె మిగుల దక్షతతోఁ బెంచి విడిచిపోయిన మూఁడుసంవత్సరముల బాలుని చర్యలు చూచినచో నామెకుఁ దెలిసిన మాతృకర్తృత్వ మహాత్వ మితరమాతలకుఁ దెలియుట దుస్తరమని యందఱకును దోఁచును. అంత చిన్నశిశువు తనతల్లి యాజ్ఞప్రకారము వర్తించుచుండెను. ఇంత చిన్నవయసునందే వాని తల్లి వాని కెన్నోనీతులను గఱపెను. వనలతాదేవికిఁ దన రుగ్ణత కుదురదని స్పష్టముగాఁ దెలిసినపిదప నొకదినమునం దెవ్వరును లేనిసమయమునఁ దనచిన్నికొమరునిఁ దనయొద్దికిఁ

బిలిచి "నాయనా! నాశరీరమున రోగము హెచ్చెను. అది యి చటఁ బాగుకాదు. నేనుపరమేశ్వరుని సన్నిధికరిగిన నాబాధ నివారణమగును. తదనంతరము బాగయి వచ్చెదను. నేను పోవునపుడు నీవు ఏడ్వక సంతోషముగా బుద్ధి కలిగియుం డుము." అని చెప్పఁగా నాబాలుఁడానందించెను! తదనంతర మామె ౧౮౦౦వ సంవత్సరము నవంబరు 3వ తేది రాత్రి స్వర్గ స్థయయ్యెను. ఆమెకొఱకై యామెబంధువు లందఱును విల పించుచుండిరి. అప్పు డాశిశువు తల్లిమాటల యందలి విశ్వా సము వలన నెంతమాత్రము నేడువక గులాబిమొదలగు పూ వులను దెచ్చి తల్లిశవముపై నుంచి "యమ్మా దేవునిసద్దికిఁ బొమ్ము బాగయిరమ్ము" అని చెప్పి యామెను గొనిపోయిన పిదప నేడ్చువారినిఁ గని "మీ రేలయేడ్చెదరు? మాయమ్మరోగ మిచట కుదురనందున దేవునికడకరిగెను. అచట బాగయి మ రల రాఁగలదు. ఇట్లని నాతోఁ జెప్పిపోయినది" యని తన ము ద్దుమాటలతోఁ జెప్పెను. ఈవనలతాదేవి మరణము కామె బంధువులేకాక యామెను గనినవారును, నామె సద్గుణముల ను వినినవా రందఱును మిగుల దుఃఖించుచున్నారు. ఈమెకు మరణసమయమున నిరువదియొకటవసంవత్సరము. ఈమె యింత యల్పవయస్సునచే మృతినొందుట దేశముయొక్క దురదృ ష్టమని చెప్పవలయును.



# గణపాంబ



ఈమె బేటరాజునకు భార్య; గణపతిదేవునకుఁ గూతురు ఈగణపతిదేవుఁడు క్రీ. శ. ౧౨౨౮వ సంవత్సరమునుండి ౧౨౫౭వ సంవత్సరమువఱకును నోరుగంటిరాజ్యముఁ బాలించిన రాజేయైయుండినచోనీగణపాంబరుద్రమదేవికిఁ గూతురై యుండును. కానియిందునకుఁ బ్రబలనిదర్శనము లేవియుఁగానరాకున్నవి. గణపాంబయుఁదనపతి మరణానంతరమునందాతని యేలుబడిలో నుండిన యాఱువేలగ్రామములనుమిగుల నేర్పుతోఁబాలించెను. ఆమె మిక్కిలి యౌదార్యవతియై యనేకవిధములైన ధర్మకార్యములను జేసెను. ఈమె ధర్మకృత్యములను జరితమును దెలుపు శిలాశాసనమొకటి కృష్ణామండలములోఁ జేరియున్న గుంటూరు తాలుకాలోనున్నది. దానిలోని కొన్ని సంగతుల నిందుఁ బొందుపఱచెదను.

"మిగుల ప్రసిద్ధిఁగాంచిన కాకతీయవంశమునందు అనేక ప్రభువులు రాజ్యము చేసినమీఁదట వైరిభీకరుఁడగు బేటరాజు సింహాసనారూఢుఁడయ్యెను. శివునకుఁ బార్వతివలెను, విష్ణువునకు లక్ష్మివలెను, ఈబేటరాజునకు గణపాంబ ధర్మపత్ని యయ్యెను. ధర్మకటకపురిని మిక్కిలి యోగ్యముగాఁ బాలించి బేటరాజు కీర్తిశేషుఁడయ్యెను. తదనంతరం బాతనిభార్యయగు గణపాంబ సింహాసన మెక్కెను. ఈమె భర్తయొక్క సుగతి

నభిలషించి యాయనపేరిట ధన్యకటక పురమునం దొకదేవాలయము నిర్మించెను. ఈ యుద్దేశముతోనే యీరాణి బంగారు శిఖరముగల యింకొకగుడిని గట్టించి దానిలో బేటేశ్వరుఁడను లింగమును ప్రతిష్ఠింపఁజేసెను. ఈగుడికి నైరాాదేవి ఫలవంతమగు బీనదీవియను గ్రామము నొసంగెను. ఈమహనీయురాలు ధన్యకటకపురిలో ౧౨గురు బ్రాహ్మణోత్తములకు ౧౨ భూపసతులును ౧౨ గృహములును దాన మొసంగెను. ఈమె తనతండ్రియగు గణపతిదేవుని పేర గణపేశ్వరుని(శివుని) యాలయమొకటి కట్టించెను. ఈగుడికై యీరాణిచింతపాడు గ్రామము నొసంగెను. ఈ రాణిహస్తములు సతతము శివుని నర్చించుటయందే వినియోగించెను. [illegible] మాహాత్మ్యమును ప్రకటించు శ్లోకముతో యామె కానుకము నిచ్చుచుండెను. ఈ రాణివేదములయం దధికవిశ్వాసముకలది కావుననే విశాల రాజ్యక్లేశము కలిగియున్నను ఆనందముతో దినములు గడపెను. రెండవపార్వతి యనఁదగిన యీమె మహాత్మ్యము నెవ్వరు తగినట్టుగ వర్ణింపఁగలరు?" ఈ మహనీయురాలిచరితముమ గుఱించి యింతకంటె నధికమేమియుఁ దెలియదు కాన విధిలేక మిగులచింతతో దీనిని ముగించుచున్నదాన.



Vedam and Co., Printers. 13, Oil Monger Street, Madras.